# ముందుమాట

చాలా రోజులుగా రాద్దాం రాద్దాం అనుకుంటూ తాత్సారం చేస్తూ ఆలోచిస్తూ వున్న కథను 1998 లో రాసాను. చదివి, మార్పులు చేర్పులు వుంటే చెప్పండని బాపు, రమణలకి ఇచ్చాను. నాలుగు రోజుల తరువాత మొత్తం కథ బాపు దస్తూరీలో నాకు అందింది. “నాకు చదివిన దాని కంటే ఒక సారి రాస్తే బాగా అర్థం అవుతుంది. అందుకని రాసాను”. అని చెప్పి వారి అక్షరాలలో కథను నాకు అందించారు. నా కథకు జరిగిన అపూర్వ గౌరవం ఇది. తర్వాత బాపు గారే అమెరికాలో వుండే సాహితీ మిత్రులు డా. జంపాల చౌదరి గారికి ఒక కాపీ పంపారు. ఆయనకు కూడా కథ చాలా నచ్చింది. దానిని వెబ్ సైట్ లో విపులంగా సమీక్షించి, బాపు దస్తూరీలో కథ కావాలంటే తెలపండి, పంపిస్తానని నోటు పెట్టారు

కథాభిమానులు, డాక్టర్ జంపాలగారి అభిరుచి తెలిసిన పలువురు తెలుగువారు ఆ కథను అడిగి తెప్పించుకున్నారు. ఈ శ్రమంతా జంపాలగారి దే. తరువాత ఎంతో అపేక్షగా ఆదరంగా ఒక డాలర్ల చెక్కు కూడా పంపారు. ఆయన బోణీ మంచిదే. తర్వాత మిథునం కథ సాధారణంగా తెలుగు కథ పొందే పేరు కన్నా ఎక్కువ పేరును, డబ్బును సంపాదించి పెట్టింది.

ఆంధ్రభూమి వీక్లీలో నాలుగు వారాలు వరుసగా వచ్చింది. బాపు దస్తూరీలో యథాతథంగా రచన లో సాయి గారు ప్రచురించారు. బాపు గారిని అడిగితే రచన కోసం బొమ్మలు వేసిచ్చారు. బాపు ఇల్లస్ట్రేషన్‌ను ఆ సంచికలో ముఖచిత్రంగా వేసి, “దస్తూరీ తిలకం-బాపు” అనే విశేషణంతో మిథునం కథను గౌరవించారు. విదేశాల నుంచి, స్వదేశం నుంచి అనేక ఫోన్లు, మెయిల్సు అందుకున్నాను. కొందరు నూటపదహార్లు, అర్థనూటపదహార్లు కానుకగా పంపారు. వాకాటి పాండురంగారావు, పోరంకి దక్షిణా మూర్తి, కోడూరి శ్రీరామమూర్తి లాంటి పెద్దలు ఎంతగా అభిమానించారో మాటలలో చెప్పలేను. రంగనాయకమ్మ మిగిలిన విషయాలను గట్టున పెట్టూనే కథ నడిపిన తీరును మెచ్చుకుంటూ మంచి వుత్తరం వాసారు.

పత్రికలలో ప్రశంసలు, విశ్లేషణలు అధిక సంఖ్యలో వచ్చాయి. వందలాది వుత్తరాలు వచ్చాయి. ఆ సంవత్సరం కథ న్యూఢిల్లీ సంస్థ ఏటా ఇచ్చే జాతీయ అవార్డును మిథునం కథకు ఇచ్చి సంస్కరించారు. ఆ సందర్భంగా వట్లూరి స్యామల గారు ఇంగ్లీషులోకి అనువదించారు. ఒక్కొక్క భాషలో బహుమతికి ఎంపికైన కథలను ఇంగ్లీషులోకి అనువదించి, ఏటా ఒక సంచికగా వెలువరించడం వారి రివాజు. అట్లా వచ్చిన వాల్యూమ్ లో చదివి ప్రఖ్యాత దర్శకులు, రచయిత, జ్ఞాన్ పీఠ్ అవార్డు గ్రహీత ఎమ్. టి. వాసుదేవన్ నాయర్ మిథునం కథ నచ్చిందని, మళయాళంలో చలన చిత్రంగా రూపొందించాలని

వుందని రాశారు. ఎగిరి గంతేశాను. తర్వాత సినిమా నిర్మాతలు నన్ను సంపదించారు. "వొరు విరుచిరుపుంజరి" (ఒక చిరునవ్వు) పేరుతో మళయాళంలో వాసుదేవన్ నాయర్ దర్శకత్వంలో రూపొందింది. కేరళలో శంకరాచార్య పుట్టిన వూరు అయిన కాలడిలో, పూర్తి అవుట్ డోర్ లో చిత్ర నిర్మాణం జరుగుతుందని చెప్పారు. ఈ సినిమా అనేక ఫిలిమ్ ఫెస్టివల్స్ లో ప్రదర్శితమైంది. ఆసియా ఫెస్టివల్ కు ఎంపిక అయింది. అ నేక మార్లు టీ.వీ. ఛానెల్స్‌లో టెలికాస్ట్ అయింది. అదంతా ఎమ్ .టి. చలవ. ఈ సందర్భంగా అనేక మార్లు వారితో మాట్లాడే అదృష్టం కలిగింది. ఇంకా ఎందరో మళయాళీ ప్రముఖులు కూడా పరిచయమయినారు. మళయాళంలోకి ఆయన తెలుగు నుంచి అనువాదం చేయించుకున్నారు. తర్వాత అనేక భారతీయ భాషలలో వచ్చింది. సంస్కృతంలోకి తర్జుమా అయింది. కన్నడంలో విజయ, కర్నాటకలో మిధునం ప్రచురిత మైంది.జర్మనీతో పాటు నాలుగు విదేశీ భాషలలో వెలువడింది. అడిగిన వారికి అడిగినట్టు ఫోనులో మెయిల్ ద్వారా అనుమతి ఇచ్చేవాడిని. తర్వాత ఎక్కడ వచ్చిందీ, ఏమిటీ అజ కనుక్కోలేదు.

రేడియో కోసం, స్టేజి కోసం నాటకంగా రూపొందించారు. ఈ ప్రయత్నం చేసిన వారు సినీ నటులు శ్రీ సుత్తివేలు. అనేక కథా సంకలనాలలో వెలువడింది. శ్రీ గుమ్మడి గారికి చాలా ఇష్టమైన కథ. నటులు రచయిత తనికెళ్ళ భరణి,బ్రహ్మానందం, సిరివెన్నెల, జొన్నవిత్తుల, అందరూ ఏదో వొక సందర్భంలో దీని గురించి ఒక మంచి మాట అన్నవారే. మంచి అభిరుచి మనసు వున్న నిర్మాత స్రవంతి రవికిషోర్ దీనిని తెరకెక్కించాలని చాల వుబలాట పడుతూవుంటారు. నేనే వారి వుత్సాహం మీద కాసిని నీళ్ళు జల్లుతూ వుంటాను. ఎందుకంటే యిది "కమర్షియల్ వెంచర్" అవదు. రవికిషోర్ లు డబ్బు జనరేట్ చేసి పదిమందిని పోషించడం శ్రేయోదాయకం అని నా అభిప్రాయం. శ్రీ ముళ్ళ పూడి వెంకటరమణ గారు బాపు గారి లీలాజనార్ధనమ్ ఆర్ట్ బుక్ కి ముందు మాట రాస్తూ - మిధునం కథలో అంతర్లీనంగా వున్నస్నేహరాసిక్యతను, భార్యాభర్తల అనుబంధాన్ని ప్రస్కావించారు. ఇప్పటికీ ఈ కథ ప్రస్తావన ఎక్కడో ఒక చోట వస్తూనే వుంటుంది. అయితే, అన్నీ పొగడ్తలేనా అంటే తెగడ్తలూ వున్నాయి. అతి కొద్దిమంది మాత్రమె "వివాహ వ్యవస్థను గ్లోరిఫై చేశాడు" అని కేకలెశారు. "కథలో అంత సీన్ లేదు, బ్రాహ్మణ వంటల మీద రాయబడింది" అన్నారు. నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. ఎందుకంటే నేను బ్రాహ్మణుణ్ణీ మరియు భోజన ప్రియుణ్ణీ.

—శ్రీరమణ

శ్రీరామ

# = మిథునం =

• శ్రీరమణ •

అప్పటికే పొద్దువాటారింది. పెరట్లో ఎండేసిన సరుగుడు పేళ్లు ఓ మూల పొందికగా పేర్చి తడవకుండా తాటాకులు కప్పి, మిగిలిన చితుకులు ఏరుతూ వంగి లేచి ఆయాసపడుతోంది బుచ్చిలక్ష్మి.

ఆమెను వెతుక్కుంటూ దగ్గరగా వచ్చి వెనక చేతులు కట్టుకుని అంతా కాసేపు ఆసక్తిగా గమనించి - "ఏం చేస్తావే ఇన్ని కట్టెలూ...." అన్నాడు అప్పదాసు దీర్ఘాలు తీస్తూ.

ఆవిడ చురుక్కున ఒక చూపు చూసి "రేపు నువ్వు హరీ అంటే చితి పేర్చడానికి కావద్దూ..." అన్నది అదే శృతిలో దీర్ఘం తీస్తూ...

ఆయన ఏ మాత్రం చలించకపోగా ఫెళ ఫెళా నవ్వి- "పోనీలే దుంప తెగా- నీ కెంత ముందుచూపే ముసలిఘటమా..." అని అటుగా వెళ్తున్న నన్ను పిలిచి "చూశావురా మీ అత్తయ్య పాతివ్రత్యం! సతీ సహగమనానికి సిద్ధమవుతోంది వెర్రిమొహంది- లేకపోతే యీ ఒక్క కట్టెకి యిన్ని కట్టెలు కావాలిట్రా...." అన్నాడు తెరలు తెరలుగా నవ్వుతూ. ఆ మాటకు నాకూ నవ్వొచ్చింది. ఆవిడ పటపటా లేని పళ్ళు కొరకబోయి పెదాలతో నాలిక్కరుచుకుంది. కోపంగా మెటికలు విరిచి అతి కటకటమనకపోతే ఉక్రోషం ఆపుకోలేక "అబ్బో! సరసాలకేం తక్కువలేదు బోడి చమత్కారా లకి మాత్రం లోటు లేదు... ఒక నగనా... ఒక నట్రనా... కాపరానికొచ్చి అరవయ్యేళ్ళు అయింది. ఒక ముచ్చటా అచ్చటా - ఒక రొచ్చారనా ఒకరు పోయారనా- ఒక తీర్థమా- ఒక శార్థమా - ఆవిడ స్వరం గమకం తగ్గి గద్గదమైంది.

మామయ్య నవ్వు కట్టేసి ఒక్క అడుగు వెనక్కి వేశాడు.

"అసలు నాతలరాత ఇలా అఘోరించింది గాని ఆ దాక్షారం సమ్బంధమే — కుదిరితే ఒంకులొడ్డాణం, ఆరు జతల గాజులు, చంద్రహారం పెడతా మన్నారు. కాణీ కట్నం వద్దన్నారు... దేనికైనా పెట్టి పుట్టి వుండాలి. ఇప్పుడేమనుకుని ఏం లాభం-"

అత్తయ్య "దాక్షారం" అని మొదలు పెట్టగానే మామయ్య వెనక్కి తిరిగి ఎడంబుజం మీంచి కాశీ తువ్వాలు తీసి ఒక్క సారి దులిపి కుడిబుజం మీద వేసుకుని తొణుకూ బెణుకూ లేకుండా తాపీగా ఇంటివైపు కదిలాడు. పొడుగాటి తన నీడను నేలమీద తొడుగులా లాక్కుంటూ ఇంట్లోకి

వెళ్ళిపోయాడు అప్పదాసుగారు.

నేను అనుకోకుండా ఇరుకునపడ్డాను. ఎట్లా బయటపడాలో తోచక అక్కడే నిలబడ్డాను.

“ఏవుందిరా యిక్కడ బొమ్మలాట: మొగుడూ పెళ్ళాలున్నాక అనేకం అనుకుంటాం- దానికి నువ్వు పళ్ళన్నీ యికిలించాలా... చిన్నా పెద్దా ఉండఖ్ఖర్లే... చూశావుగా సంబడం యిహాపో...” అని నన్ను అత్తయ్య గసిరింది.

ఓ పిచ్చి చూపు చూసి పరుగెత్తాను.



*

ఊరి నడిబొడ్డున విశాలమైన స్థలం- చుట్టూ ఎత్తుగా పెరిగిన చెట్లు- అందులో గన్నేరులూ గోరింటలూ మునిగోరింటలూ రేగికంపా గచ్చపొదలూ మధ్యమధ్యన ఎత్తుగా నిలబడి పహరా కాస్తున్న సిపాయిల్లా తాడిచెట్లూ- వాటి ఆకులకు తేనెపట్లూ మొవ్వల్లో కాకి గూళ్లూ వుండేవి. కంచెకి ఎర్ర గురివిందలూ కాశీరత్నాలూ శంఖుపూల తీగెలూ పూలబటాణీలూ చిత్తపత్తుగా అల్లుకుని పచ్చటి గోడకి రంగవల్లులు దిద్దినట్లుండేది.

ఆ పచ్చటి ప్రాకారం మధ్య చిన్న ఒంటిదూలం పెంకుటిల్లు- కొండపల్లి బొమ్మరిల్లులా కొలను మధ్య తామర మొగ్గలా వుండేది. ఆ ఇంట్లో మనుషులు ఇద్దరే అయినా వీధిబడిలా

ఎప్పుడూ సందడిగా వుండేది. ఆ ఇంటివాళ్ళు సయానా అత్తయ్యా మామయ్యా కాదుగాని నాకు వేలు విడిచిన వరసలు.

అప్పదాసుగారి ఇల్లంటే అందరికీ హడల్. పులిగుహతో సమానం. ఎవరైనా ఇంటికి వెళితే గుమ్మంలోనే ముక్తసరిగా మాట్లాడి పంపేసేవాడు. ఆయన మెట్టుదిగి ఎక్కడికీ వచ్చేవాడు కాదు. చాలా నిక్కచ్చైన మనిషి, నన్ను అంత తేలికగా తన కొంపకి రానిస్తాడా! పచ్చటి పెరడుకీ పాడిపశువుకీ పొత్తు కుదరదని ఆవునీ దూడనీ మా పోషణలో పెట్టాడు. పాలచెంబుతో దర్జాగా రెండుపూటలా వెళ్ళేవాణ్ణి. రోజులో ఇంకో నాలుగుసార్లు అక్కడి చోద్యం చూడ్డానికి, వాళ్ళు తిట్టినా తిమ్మినా వెళ్ళకుండా వుండలేకపోయేవాణ్ణి. అక్కడ దొరికే వినోదం ముందు ఆ తిట్లు బలాదూర్.

అప్పదాసుకి ఎనభై ఏనాడో దాటింది. పై ఇద్దరు కొడుకులూ అరవయ్యో పడిలోకి వచ్చారు. నూనెలో ముంచి తీసిన ఏకులా వున్నాడు. కంటిచూపు కరగలేదు. పంటి పదును తరగలేదు" అని వూరి అరుగుల మీద అనుకుంటూ వుండేవాళ్ళు.

"హాయిగా ఐదుగురు కొడుకులు- అందరూ సంపాయించుకుంటూ వృద్ధిలోకెళ్తున్నారు. మనవళ్ళూ మనవరాళ్ళూ- తామరతంపరగా వున్నారు. పోనీ వీళ్ళని పట్టించుకోని వాళ్ళా అంటే అదీకాదు. ఈ వయస్సులో ముసలి ఘటాలు రెండూ యిక్కడ ఒంటరిగా వుండకపోతే ఒక్కొక్కడి దగ్గర రెండు నెలలున్నా ఏడాది తిరిగిపోతుంది. ఏమిటో చాదస్తం" అని మా అమ్మ అప్పుడప్పుడు నాన్నతో అనేది.

"చాదస్తం అని నువ్వనుకుంటున్నావ్. 'ఎవడి రుచి బతుకులు వాడివి. ఎంత కొడుకులైతే మాత్రం- అకారణంగా ఇంకోళ్ళ మీద వాలిపోకూడదు. అయినా అంతా ఈశ్వరేచ్ఛ- గాలీనీళ్ళూ ఎక్కడ ప్రాప్తమో అక్కడ' అని మా దాసు బావ అంటాడు" అనేవాడు మా నాన్న.

నేను పుట్టి బుద్ధెరిగి పదిహేనేళ్ళు- నీరుకావి అంగోస్త్రం - పైన ఎర్రటి కాశీతువ్వాలు తప్ప ఒంటినిండా బట్టకడితే మావయ్య ఎట్లా వుంటాడో నేనెరగ. అత్తయ్య కాసె పోసి చీరకట్టుకుని ముక్కుకి ఎర్రరాయి బేసరి కాళ్ళకి వెండి కడియాలు అందెలతో వయసు మళ్ళిన గౌరీదేవిలా వుండేది.

మావయ్య మాత్రం- "ముసలిజింకకి చీర కట్టినట్టున్నావే అమ్మీ" అని రోజుకోసారైనా తిట్ల తలంటి పోయించుకునేవాడు.

వాళ్ళ అబ్బాయిల పేర్లు తమాషాగా వుంటాయ్. కృష్ణ కేశవ గోవింద మాధవ నారాయణ- వరాన్గ - ఆ పేర్లేంటి మావయ్యా? అని మేం అడిగితే- నవ్వి- "మొదటి వాడికి కృష్ణ అని ముద్దుగా పెట్టా- ఏడాది తిరక్కుండా ఇంకోడు- మీ అత్తయ్య వైపరీ చూస్తే యిదేదో వుచ్చపాదు తీరుగా వుందని అనుమానం వచ్చింది. ఇలా ఏటేటా పేర్లకోసం ఎక్కడ వెతుకుతాంలే అని భగవంతుడి మీద భారం వేసి కేశవ నామాలు అందుకున్నా-"

"నా బిడ్డలు వెర్రి పుచ్చులు కాదు. రత్న మాణిక్యాలు" మురిపెంగా నిష్ఠూరమాడేది అత్తయ్య.

*

వాళ్ల బావి గిలకలా రాగాలతో అగ్రహారం మేలుకునేది. అప్పదాసు గారు కేశవనామాలు శ్రీసూక్తం పురుష సూక్తం నమక చమకాలూ వల్లిస్తూ బొక్కెనతో నీళ్ళుతోడి తలమీద దిమ్మరించుకుంటూ రెండు ఘంటల సేపు స్నానం చేసేవారు.

అంతసేపూ బుచ్చి లక్ష్మి - "సీతమ్మ పెనిమిటి శ్రీరామ చంద్రుడూ ఆకాశ చాయుడమ్మా - ఆజానుబాహుడమ్మా- చూడగా అబ్బాయి అరవిందనేత్రుడమ్మా" అని పాడుకుంటూ చెట్లపాదుల్లో తిరుగుతూ సన్నటికాలువల్లోంచి నీళ్లని నడిపిస్తూ- కాసిన పూసిన మొక్కల్ని పరామర్శిస్తూ పెరడంతా తిరిగేది. అక్కడక్కడ ఆగి ఓ మందారాన్నో మంకెన్ననో తుంచి తలలో తురుముకునేది. విచ్చిన పత్తికాయలు కంటబడితే భమిడి పత్తి వొలిచి కొంగున ముడివేసేది. రాత్రి రాలిన కొబ్బరి బొండాలనీ, మట్టల్నీ ఓ పక్కన జమ చేసేది. "పెరడంటే అదే పెరడు. కాలు పెడితే కన్నుల పండుగ్గా వుంటుంది. ఆ వయస్సులో ఆ పిల్లకి దణ్ణం పెట్టాల్సిందే" అని మా నాన్న మెచ్చుకునేవాడు. బావి గట్టుకి అంటి పుచ్చుకున్నట్టు ఎప్పుడూ ఊరక తగిలే చోట అయిదారు అరటిచెట్లూ, అమ్మ కొంగు పట్టుకు నిలబడ్డ పిల్లల్లా వాటి పిలకలూ; వాటి నీడన అల్లం మోసులూ, కంద పిలకలూ- ఇంకోవైపు మొరకమీద వంగలూ మిరపలూ- కంచెవారగా కాకర బీర దొండ కంచెనపడి కోసుకున్నన్ని కాయలు కాసేవి.

రోజూ నీళ్లు అడగని బాదం చెట్టూ, ములగా ఓ మూలగా వుండేవి. దబ్బ నిమ్మ పక్కనే వున్న అంటీ ముట్టనట్టు తోడికోడళ్ళలా వుండే కూరాకుమడులు గుట్ట మీద వాలిన గువ్వపిట్టల్లా వుండేవి. గుబురుగా ఘుమఘుమలాడుతూ విస్తరించిన కర్వేప వంటింటి గుమ్మం పక్కనే సదా అందుబాటులో వుండేది. నేలమీద చుట్టలుగా అల్లుకున్న గుమ్మడిపాదు అప్పుడే ఊరేగి వచ్చిన శేషపాన్పుని గుర్తుచేసేది. ఇల్లెక్కన ఆనప్పాదు ఆనూపంగా అల్లుకుని కప్పుని కప్పేసినపుడు ఆ బొమ్మరిల్లు అద్దంలో కొండ! దొడ్డిగుమ్మం ఎదురుగా తులసి కోట- కోటలో కొలువైన తులశమ్మ కోటచుట్టూ పరిచారికల్లాగా మందారాలూ మంకెన్నలూ కనకాంబరాలూ కాగడా మల్లెలూ నిలబడి వుండేవి. కోటమీద ఉసిరి చెట్టు నీడలానేవి ఎడంగా అటూ ఇటూ కోట స్తంభాల్లాగా రెండు కొబ్బరిచెట్లూ వాటి మానుల చుట్టూ దవనం మరువం చేమంతీ చేరి స్తంభాలకు పచ్చలూ కెంపులూ పొదిగిన పొన్నులు తొడిగినట్టుండేది.

కొబ్బరి ఆకులు అంతెత్తులో కలగలిపి కోటకి పచ్చని ప్రవేశద్వారంలా కనిపించేది. పారిజాతం రాలితే తులశమ్మ కొప్పు నిండేది.

మావయ్య మధ్యమధ్య మంత్రాలు ఆపి బావిగట్టు మించి- "అమ్మీ నువ్వు ఇష్టం వచ్చినట్టు పూలూ కాయలూ కోసి చావకు. అసలే నీకు ఆబ. నన్ను రానీ" అని అరిచేవాడు.

ఒక చదరంలో అవిశిచెట్లూ వాటికి అల్లుకుని తములపాకు తీగెలూ బచ్చలికాడలు పెండలం ఆకులూ వుండేవి.

"ఒసేవ్. నువ్వు వాటి జోలికి పోకు. ఆ ఆకులన్నీ ఒక్క లాగే వుంటాయ్. ఆనక తములపాకు పప్పులోనూ బచ్చలాకు తాంబూలానికి చుట్టబెడతావ్. నాకసలే రాత్రి పీడకల కూడా వచ్చింది" అంటూ మళ్లీ గిలక మీద తాడు వదిలేవాడు. అత్తయ్య ఆ మాటలు ఆట్టే పట్టించుకోకుండా "ఇదిగో కాలవ పొడుగునా గోగులూ బెండలూ చూశావా దివిటీల్లా వున్నాయ్. దోసపూతంతా పిందే! ఓ దిష్టి పిడత పెట్టాలింకే- తప్పదు" ఆవిడ అరుపు విని పని ఆపి "నువ్వు ముపొద్దులా వనవిహారం చేస్తున్నావుగా - ఇంకా దిష్టిపిడత దేనికీ- దండగ" అని మళ్లీ మంత్రాలు అందుకున్నాడు.

"మరి దిష్టిపిడత కాక ఏమవుతానూ! రాక్షసుడి చేతుల్లో పడి లంకలో సీతమ్మలా అయిపోయా గాని చిన్నప్పుడు చిదిమి దీపం పెట్టినట్టు వుండేదాన్ని" అత్తయ్య విసురుని వినిపించుకోకుండా స్వరస్థాయి పెంచి "ఆ గచ్చ పొదలోగ్గాని వెళ్లావా ఏమిటే - ఊరికే చప్పుడవుతోంది" అని దీర్ఘం తీసి- స్నానం పూర్తిచేసి ఒంటిమీదే బట్టలు పిండుకుని "నా శిరస్సు సాలి గ్రామం. ఇవ్వాళ్టికి సహస్ర ఘటాభిషేకం పూర్తయింది అనుకుంటూ బావిగట్టుమీద కూలబడ్డాడు మావయ్య. "పోనీ ఆ శివాష్టకం కూడా ఓసారి అనుకోరాదూ- చివరిపాదులు కూడా తడుస్తాయీ..." అని ఆవిడ సాగదీస్తే

"ఇవాళ్టికి స్వస్తి... ఇప్పటికే అరఘంట ఆలస్యమైంది"

"దేనికిటా ఆలస్యం? నువ్వేమన్నా నౌకరీ వెలిగిస్తున్నావనా....?" అంటూ చేతిలో జామకాయని ఎగరేసుకుంటూ వచ్చింది అత్తయ్య.

"ఇదంతా నౌకరీ కాదుటే.... మిడిమేలపు దొరలకంటే ఏ పూట కష్టానికి ఆ పూట పువ్వుల్లో పెట్టి ప్రతిఫలం ముట్టచెప్పే ఈ కొలువులో పనిచెయ్యడం ఎంత సుఖం?"

"ఇది నువ్వు రోజూ చదివే దండకమే గాని... ఇదిగో జామకాయ- దోరగా వుంది కాస్త నమిలి పెట్టు" అని భర్త చేతికి అందిచ్చింది.

"అదేమరి! పళ్లూడినంత మాత్రాన చాపల్యం పోతుందా! తలలు బోడులైన తలపులు బోడులా అన్నారందుకే-" అంటూ జామకాయ నోటికి పట్టించి, కొరికిన ముక్క నములూ- "చూశావుగా - కష్టం వుంచుకోవు కాసినవి పూసినవి ఖజానాలో వుంచుకోవు, పన్నులు దోచుకోవు" మళ్లీ

యింకో ముక్క కొరికి "దండింపులూ బదిలీలు వుండవ్, దణ్ణాలూ పొగడ్తలూ కోరవ్- ఇంతకంటే గొప్పదొరలు ఎక్కడ దొరుకుతారు"

"ఏదీ గుజ్జు... ఆ మాటా యీ మాటా చెప్పి మొత్తం మింగి కూచున్నాక పరగడుపున..."

అత్తయ్య నోటికి అభయహస్తం చూపి కంగారుపడవద్దని సూచించి చివరి విడతగా ముక్క నమిలి అత్తయ్య నోటికి అందిచ్చాడు.

ఆవిడ కుదుటపడి జామి గుజ్జు చప్పరిస్తూంటే ఆయన విశ్రాంతిగా బావి బొడ్డుకి జారపడి- "సత్సంగత్వే నిస్సంగత్వం- మంచితోడూ మంచినీడా" అనుకున్నాడు.

*

నాలుగు క్షణాలు సేదదీరి మెల్లగా లేచి చెట్లలోకి నడిచాడు. ఆవిడ అనుసరించింది. అన్నిటికీ తడువు తగిలిందో లేదో చూస్తూ- ఆకుల్నీ పూతల్నీ గమనిస్తూ, వాలిన మొక్కల్ని సరిచేస్తూ అంతా కలయతిరిగాడు.

పెద్ద చెట్లని పిల్లల పేర్లతో ముద్దుముద్దుగా పిలుచుకునే వాళ్లు.

నిమ్మచెట్టుకి పిందె పడితే "మన కిష్టప్ప ఆకుఆకునా పిందె తొడిగాడే! పెద్దరికం వచ్చేసింది" అని మురిసిపోయేవారు.

కొబ్బరి గెలలు దిగితే- "మాధవుడు మనల్ని కనిపెట్టే వున్నాడే- మన బరువు బాధ్యతలు వాడు బుజాన వేసుకున్నాడు చూడు..."

మామిడి పూత పూస్తే "గోవిందుడు యీ పెద్ద ఘటాన్ని మర్చిపోలేదే- మనల్ని ఓ కాపు కాస్తానంటున్నాడే-" అనుకుంటూ పొద్దు పొద్దునా తలచుకుని ఆనందపడే వాళ్లు.

ఆ పూటకి కావాల్సిన కూరల గురించి తీవ్రంగా ఆలోచించి ఓ నిర్ణయానికి వచ్చాడు మామయ్య.

నాలుగు అరటికాయలు ఆవపెట్టి వండే షరతు మీద మంజూరు చేశాడు. "పది తోటకూర కాడలు పప్పుతో వేసుకో- ఇదిగో పది కొత్తిమీర రెమ్మలు దేనిలో వెయ్యనా- వంకాయ పచ్చడికి- నిన్న కోసిన మూడు మూడు వంకాయలూ వున్నాయి కదా- పచ్చడికి తాజాకంటె వాడిన వంకాయ శ్రేష్ఠం... యీ కొత్తిమీర అందులో వినియోగించు. కర్వేపాకు అప్పటికప్పుడు దూసి వెయ్- చెయ్యమించి చారులో పడాలి. అది గుర్తుంచుకో.." మామయ్య గంభీరంగా చెబుతూంటే అత్తయ్య వెనక నించి వెటకారంగా చేతులు తిప్పుతూ బుర్ర వూపుతూ సరే అంటోంది.

"ఇదిగో! వుంది కదా అని కొత్తిమీర వూరికే దూడమేతలా వేసెయ్యకు. వంకాయ బజ్జీ పచ్చడిలో- తత్వాలు పాడేటప్పుడు తంబూరా శృతిలా కొత్తిమీర వుండాలి గానీ హద్దుమీరి అసలు

విషయాన్ని మింగెయ్యకూడదు వెటకారం వద్దు- కావలిస్తే నా ముక్కుకి వేద ప్రమాణం వుంది"

ఇద్దరూ నిమ్మచెట్టు నీడకి వచ్చారు. నిమ్మపండు కోయబోతే అంద లేదు. మావయ్య భుజం మీది కాశీతువ్వాల్ని నడుముకి బిగించి "బుచ్చీ- అందుకో" అంటూ అమాంతం ఉప్పుప్పుగోనెలా మూపున ఎత్తుకున్నాడు. అత్తయ్య పండుకోయగానే గోనెని వదిలేసి నిటారుగా నిలబడ్డాడు మావయ్య. ధభేల్ మన్న చప్పుడు ఘల్లున అందెల మోత "చచ్చాన్రో దేవుడా" అన్న కేక ఒక్కమాటుగా వినిపించాయి. నేలజారిన కాశీతుండుని దులిపి భుజాన వేసుకుంటూ "చచ్చిన బర్రె దూడంత బరువున్నావే బుచ్చీ! రాజకుమారిలాగా ఏడుమల్లెల ఎత్తు వుంటావనుకుని శక్తికి మించిన పని పెట్టుకున్నా" అన్నాడు.

ఆవిడ సతికిలపడి ఆపసోపాలు పడుతూనే "పోగా పోగా పై గుడ్డ బరువనీ- వయసుడిగి పోయాక- అంతేమరి- పైగా ఆడలేక మద్దెల మీద పడ్డట్టు..." మూలుగుతూ లేవబోతూంటే మామయ్య సాయపడబోతే విదిల్చి "కావాలనే పడేశాక... కిష్టప్పే సాక్ష్యం ... ఇంతకింత అనుభవిస్తావ్"

మెల్లిగా లేచి బురద కొట్టుకున్న చీరని చూసుకుని తిట్టుకుంటూ బావివైపు కదిలింది.

అంతలో వున్నట్టుండి బావి గిలక చప్పుడయేసరికి మావయ్య బావి వైపు చూశాడు.

"నేనే.. అత్తయ్యకి సాయం చేద్దామని..." నీళ్ళు నమిలాను.

మామయ్య అగ్గిరాముడై పోయాడు.

"ఒరే అరిష్టపు వెధవా! తోకచుక్కలా నా కొంపచుట్టూ తిరుగుతావేరా! నువ్వెప్పుడు దాపురించావురా!" అన్నాడు బాధావేశంగా.

"వంకాయ బజ్జీ పచ్చడి దగ్గర" అన్నాను వినయంగా.

"ఔను ఒరే, అప్పదాసు దొడ్లో గోప్యంగా ఉల్లిమడి వేసి పెంచుతున్నాడని ఊరంతా గుసగుసలాడుతున్నారట- నీ ప్రయోజకత్వమేనా ఇదంతా?"

"........."

"నా నేల- నా ఇష్టం- వురేయ్ ఉల్లిమడి కాదు— గంజాయి- గంజాయి తోట పెంచుతా- నన్నేం వెలేస్తారా. తలతీసి మొలేస్తారా. అరుగుల మీద కూచుని అపభ్రంశపు కూతలు కూయడం కాదు. రమ్మను"

నా బిక్క మొహం చూసి అత్తయ్య అడ్డుకుని "అబ్బే! ఎంత గారం చేసినా అసలు ఉల్లిపాయ మన నేలన ఊరదురా- చూశాంగా" అంది.

"ఇసి పిచ్చిపీనుగా నువ్వు నోరు ముయ్యవే - బావురుకప్పలాగా..."

అని ఉసిన్నపోయి వాడిన తోటకూర కాడలా తలవాల్చాడు మావయ్య.

*

బుచ్చిలక్ష్మి వంట పొయ్యి వెలిగించింది.

బయట ఎండ చురుకెక్కింది.

అప్పదాసు గారు దినచర్య ప్రకారం "ఆదిదేవ నమస్తుభ్యం ప్రసీదమమ భాస్కర..." పఠిస్తూ ఎండపొడలో నులకమంచం వాల్చి- దానిమీద వంగ దోస ఒరుగులూ, మామిడిటెంకలూ, బూడిద రాసిన గుమ్మడి గింజలు వడియాలు, అప్పడాలు, చల్ల మిరపకాయలు, తెలగపిండి, వేపపూత చిట్టింత పొట్టు, రేగి వడియాలు విడివిడిగా చేటల్లో, చదరలతో, జల్లెళ్లలో ఎండబెట్టి- చిన్న కర్రపుల్ల పట్టుకుని అక్కడే కాపలా కూచున్నాడు.

మంచం పక్కనే చాపమీద కుంకుళ్లు ఎండపోశాడు. ఆయన కళ్లల్లో చిన్నపిల్లలు బాణసంచా ఎండబెట్టుకున్నంత ఉత్సాహం కనిపిస్తోంది. ఎండని బట్టి మంచం దిశ మారుస్తూ అప్పుడప్పుడు సరుకుని కలయ తిప్పుతూ రుచులు ఊహించుకుంటూ తన్మయుడవుతున్నాడు.

"....సర్వలోక పితామహమ్" వడియం విరిచి నోట్లో వేసుకుని నవ్వుత్తూ "ఆహా! తేజసాం పుంజం వాయురాకాశ... బుచ్చీ... మేనక... బుచ్చీ...!" పిలుపువిని "ఆ వచ్చెవచ్చె..." అంటూ ఆదరాబాదరాగా వంటింట్లోంచి వచ్చింది.

"విశ్వేశమ్... చూడ్డానికి గవ్వలూ నోట్లో వేసుకుంటే గుల్లలూ...!"

"ఏమిటి?" "వడియాలు! బుచ్చీ! నువ్వు లక్ష చెప్పు నీ చీర మీద పెట్టిన వడియాలకి రుచికోరు రుచి వుంది"

"ఎందుకుండదూ. అది మన కేశవుడు పెట్టిన చీరండీ..." ఆవిడ మొహం చేటంత చేసుకుని ఓ క్షణం పరధ్యానంగా నిలబడి, ఉలికిపాటుతో తేరుకుని లోపలికి కదిలింది కొంగుతో కళ్లు వత్తుకుంటూ.

"....తం సూర్యం ప్రణమామ్యహం... అమ్మో! అసలు ముక్క విన్నావు కాదు" పొలికేకకి చెంగున బయటికి వచ్చి "మళ్లీ ఏమొచ్చింది. అవతల పులుసు పొయ్యిమీద వుంది..." అంది

చిరాగ్గా.

"అందులో మామిడిటెంకయ వేశావా?"

"లేదు మర్చిపోయా"

"అందుకే మరి... అపశకునంగా ఇందాకట్నుంచి నా ఎడంకన్ను రికూరికూ అదురుతోంది. అప్పుడే నాకు అనుమానం వచ్చింది- ఏదో గొప్ప విపత్తు రాబోతోందని... ఇవిగో తీసుకెళ్లు... రెండు వెయ్... చింతపండు తగ్గించుకో- ఈ పులుపు కలుపుకో" టెంకయ అందుకుని వెళ్లబోతుంటే-

"ఆగు... ఆత్రం లేదు.... మరగనీ- బాగా మరగనీ. ధప్పళం దాంపత్యం. మరిగిన కొద్దీ రుచి. బుచ్చి జ్ఞాపకం పెట్టుకో. చిరగమాతతో ఇంగువ ముట్టించకు. ఉదారంగా వెయ్. హీనపక్షం రుద్రాక్ష పరిమాణంలో పడాలి" మామయ్య మాటకి ఎదురొచ్చి "ఆగు- ధప్పళం తెర్లుతూంటే క్షీరసాగర మథనంలా కోలాహలంగా వుండవలె- పోపుపడితే తొలకరిలా ఉరిమి రాచ్చిప్పలో ఉప్పెన రావలె"-"నా శార్ధం రావలె" అని రయ్యిన వంటింట్లోకి వెళ్లిపోయింది.

"ఆ చివరి ముక్క నాదికాదే" అనుకున్నాడు మామయ్య.

*

అది భోజనాల వేళ.

మావయ్య వంటింటి అటక మీద కూచుని తీరంగం వేస్తున్నాడు.

అటక్కి దూరంగా గోడకి నిచ్చెన వేసి వుంది. ఆ పక్కనే కూచుని అత్తయ్య అరిటాకులోకి కొబ్బరి తురుముతోంది.

మావయ్య ఊగిపోతూ- "ఝాడీలోంచి ఊరగాయ తీయమని చెప్పనెచెప్పనెచెప్పి నమ్మకంగా... నిచ్చెన లాగేస్తావా... ఒసే లంజాకీదానా- వెయ్ నిచ్చెన వెయ్"

"నే వెయ్యను గాక వెయ్యను" వుద్రేకం లేని స్వరంతో అంది అత్తయ్య.

అపర చాణుక్యుడిలా పిలకముడి విప్పి, ఝాడించి- "ఇవ్వాళ నా చేతిలో నీ చావు మూడింది... స్త్రీ హత్యా పాతకం చుట్టుకోనీ. రవరవాది నరకాయ రానీ- ఇది తథ్యం......,

"ఈ బోడి ప్రజ్ఞలకేం గాని నా చేతిలో పని అయ్యేదాకా నువ్వాదిగడం కల్ల" తేల్చి చెప్పింది.

అటకనించి వేలాడుతున్న ఉట్టితాడు పట్టుకుని కిందకి జారాలని ప్రయత్నిస్తుంటే "జారి పడ్డావంటే ఎముకలు పోగుగా మారతాక్- ఆనక నీ యిష్టం"

ఆ ప్రయత్నం మానుకుని మళ్ళీ గొంతుకి కూచున్నాడు.

"వచ్చే జన్మలో కుక్కవై పుడతాక్..." శపించాడు మావయ్య.

"ఇది మాత్రం అంతకంటే గొప్ప బతుకు కనకనా...!!"

"వస్త్రసన్యాసం చేసి శివతాండవం చేస్తా- చచ్చిపూరుకుంటాక్"

"చెయ్ చెయ్- తొంభై ఏళ్ళనాటి వెన్నుపూస. అది కాస్తా శివుడి విల్లు మల్లే పుటుక్కుమంటుంది."

"మా కాలంటే మాకగలను- నాకో వెమ్మతో పనికాదు"

"నీదేమీ సింహరాశి కాదు- మేషం-"

అత్తయ్య మాటకి మాట వడ్డిస్తూనే కొబ్బరి తురమడం పూర్తిచేసి, పొప్పు వేగించడానికి ఇనపమూకుడు కుంపటి మీద పెట్టింది. మావయ్య అటకమీంచి అత్తయ్యనీ తురిమిన కొబ్బరినీ మింగేసేలా చూస్తున్నాడు. కళ్ళు చింత నిప్పుల్లా వున్నాయి. నుదుట కుంకుమ బొట్టు మూడో కన్నులా మెరుస్తోంది.

అలికిడి అయితే "ఎవరక్కడ" అన్నాడు.

"నేనే" అంటూ భయంగా ఎదరకి వచ్చాను.

"నువ్వెప్పుడూ సమయానికి వస్తావురా - ఆ నిచ్చెన ఇటు వాల్చు నాయనా" అన్నాడు మావయ్య లాలనగా.

నే కదలబోతూంటే "నిచ్చెన వేశావో మర్యాద దక్కదు" అంది అత్తయ్య చిటపటా పొప్పు వేగిస్తూ.

"దాని కూతలకేం గాని నిచ్చెన ఇటులాగరా"

నేను తాళింపు కోరుకి రాని దగ్గు తెచ్చుకు నటిస్తుంటే గ్రహించి... మావయ్య

"పెద్దముండావాణ్ణి. చెప్పేది నీక్కాదుట్రా" అని ఘుంకరిస్తే ఇక లాభం లేదని నే కదులబోతే- "పెద్దదాన్ని చెబుతున్నా- మా యింటి విషయాల్లో నువ్వు తలదూర్చకు" అని వేగే మిరపకాయలంత ఘాటుగా హెచ్చరించింది. నేను బిక్క చచ్చి నిలబడిపోయాను. మావయ్య అసహాయంగా మచ్చుమీదనే వుండిపోయాడు.

"నాపప్పు వేసి చావు... దోరగా వేగనీ... పచ్చడికీ నాకూ అన్యాయం చెయ్యకే-" అరిచాడు.

అత్తయ్య ఏమీ పట్టించుకునే స్థితిలో లేదు. చిటపటలు సద్దుమణిగాక పోపుని సరాసరి రోట్లోకి బదలాయించింది. మావయ్య అప్రయత్నంగా ఒక్కసారి ముక్కూ కళ్లూ ఎగరేశాడు. అత్తయ్య ఆకుతో కొబ్బరిని తీసి రోటిచుట్టూ అంచుకట్టింది. చేతి గాజులు పైకి లాగి రుబ్బడం మొదలు పెట్టింది.

మావయ్యలో వుద్రేకం మళ్లీ కెరటంలా లేచింది.

"నమ్మకద్రోహం అసలు మీ వంశంలోనే వుంది" ఆటక మీంచి వస్తున్న మాటలకి రుబ్బేరోలే జవాబులు చెబుతోంది. రుబ్బడంలో రకరకాల స్థాయీ భేదాలు, గతులూ శ్రుతులూ కల్పిస్తూ వ్యంగ్యానికి వ్యంగ్యం- తిట్టుకి తిట్టు, పుల్లవిరుపుకి పుల్లవిరుపూ ధ్వనింపజేస్తూ కాసేపు కచేరీలా సాగింది.

ఈలోగా పోపు నలిగింది.

"నీ తండ్రి దక్షుడు. నమ్మకద్రోహి" మావయ్య మాటకి ఓ చూపు చూసి వూరుకుంది. పొత్రం చప్పుడు ఆగింది. చుట్టూ పెట్టిన కొబ్బరిని నలిగినపోపులోకి నెట్టింది. గాజులు గలగలమన్నాయి.

"నమ్మకద్రోహం కాకపోతే- సాలంకృత కన్యాదానం చేస్తానని చెప్పిన పెద్దమనిషి తీరా లగ్గం వేళకి ముక్కుకాడతో సరిపెడతాడా-" మావయ్య మాటకి ఒక్కసారి అటక మీదకి చూసి "అబ్బో అక్కడికి మీరే హరిశ్చంద్రం..." అంటూ గాజులు పైకి దూసి బరబరా రుబ్బేస్తూ- "ఐదొందలు రొఖ్ఖం కట్నం గుంజీ అయిదు కాసులు బంగారం పెడతానని- ఆఖరికి మూడుకాసుల్తో నాంతాడూ నల్లపూసలూ రాయించుకొచ్చారే- దానికి నాలుగు గురిగింజలెత్తు తక్కువ- సాడిభ్యాం" అంటూ పొత్రం తీసి పచ్చడి చేత్తో కలిపింది.

అంతా పైనించి గమనిస్తున్న మామయ్య- "ఆ పచ్చడి నీ యిష్టానికి రుబ్బి తగలెయ్యకే- బాగా మెదగనీ- ఇంకో నాలుగు తిప్పులు తిప్పి తగలడు. ఉప్పుకళ్లు నలిగిందో లేదో చూడు."

ఆవిడ ఏమీ పట్టించుకోకుండా పొత్రాన్ని రోటి అంచునే శుభ్రంగా చేత్తో తుడిచి- పచ్చడిని రోట్లోనే పొదివి ఆ కొబ్బరి తురిమిన ఆకునే పైన కప్పింది. అక్కడనించి లేచి మిగతా వంటగిన్నెలన్నీ ఓ చోట చేర్చింది.

“అసలా దాక్షారం సమ్మంధమే అయితే- నాఖర్మ- ఈ వంటపక్క బతుకు బతకమని రాశాడు దేవుడు” అని సణుక్కుంటూ వంటింట్లో పీటవాల్చింది.

“దాక్షారం” అనగానే మావయ్య మూలిక చూపిన పాములా పడగదించాడు.

పెరట్లోకి వెళ్ళి అరటిచెట్టున కొసాకు కోసి తెచ్చి పీటముందు పరిచింది. నీళ్ళు నింపిన రాగిచెంబు పంచపాత్ర విస్తరి పక్కన పెడుతూ “అబ్బీ ఇప్పుడు వెయరా నిచ్చెన- కాస్త జాగ్రత్తగా దింపు” అంది అత్తయ్య.

“అవసర నైవేద్యం తప్ప అసలు నైవేద్యం ఆ దేవుడికి పెట్టి ఎరగను. ఏ పాపాన పోతానో ఏమో” అనుకుంటూ కంచుమీద మూతలు తీసి, నీళ్ళు జల్లి, అక్కడినించే దూరంగా వున్న పూజామందిరానికి చెయ్యి చూపించింది- పిల్లల పేర్లు తలచుకుంటూ- మావయ్య మెల్లిగా అటక దిగి పీటమీద తిష్టవేశాడు. మాటామంతీ లేదు. మంత్రముగ్ధుడిలా వున్నాడు.

కొబ్బరి పచ్చడి ఇంత తీసి రోట్లోంచి సరాసరి ఆకులో వేసింది అత్తయ్య.

వంటకాల ఘుబాళింపులూ, వేడి వేడి అన్నం, లేత అరిటాకులో వడ్డించగా వచ్చే కమ్మటి వాసనలు మిళితమై అన్నపు ఆవిరితో పైకి లేవగానే మావయ్య జిహ్వా ఆదిశేషుడిలా పడగలు విప్పింది.

మొదటి విడత వడ్డించిన యావత్తు పచ్చడినీ మూడువేళ్ళతో తీసి నాలిక్క రాసుకుని లొట్టవేసి “బుచ్చీ! అద్భుతం! వైకుంఠద్వారంలో నిలబడ్డట్టుంది. నీ చేతిలో అమృత రేఖ వుందే” అని ఆస్వాదిస్తూ “ఆహా! అదిగో శంఖుచక్రాలూ మధ్యన తిరునామం- ఎదురుగా కనిపిస్తున్నాయంటే నమ్ము” అన్నాడు తన్మయుడై పోతూ-

అత్తయ్య నవ్వి వెండికొమ్ము చెంబుతో నెయ్యి వడ్డిస్తూ “అవీ గోడమేకులకి బోర్లించి తగిలించిన చేటా జల్లెడా- మధ్యన నిలువుగా చల్లకవ్వం అవి నీకు శంఖుచక్రాలూ తిరునామంలా కనిపిస్తున్నాయ్ - చూపు బాగా మందగించి” ఆవిడ మాటకి మావయ్య హాయిగా నవ్వి “ఆమ్మ- తిట్లకి ఓరుస్తాను గానీ పొగడ్తకి ఓర్చలేను గదా” అన్నాడు.

సిగ్గిల్లిన అత్తయ్య సొట్టబుగ్గల మొహం దానిమ్మ పండులా తోచింది.

ఆవిడ విసనకర్రతో విసురుతూ కొసరి కొసరి వడ్డిస్తూంటే అగ్నిదేవుడిలా ఒళ్ళంతా నోళ్ళు చేసుకుని తృప్తిగా భోంచేశాడు.

“బుచ్చీ! ఈవేళ వంట రక్తికట్టిందే. దీర్ఘసుమంగళీభవ!” అంటూ పీటమీంచి లేచి చెయ్యి కడుక్కోడానికి బయటకు వెళ్ళాడు.

నిచ్చెనకి చేరబడి ప్రశ్నార్థకంగా నిలబడిన నా వాలకం గమనించి “కొబ్బరి చూస్తే మీ మావయ్య నిగ్రహించుకోలేడు. పిసరంత కూడా కూరలో పచ్చట్లో పడనివ్వడు. అందుకే అటక ఎక్కించా. శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలు” అత్తయ్య మాట పూర్తికాకుండానే లోపలికి వచ్చాడు వస్తూనే నన్ను చూసి “నువ్వెందుకురా దీవెన్న పకీరులా కొంప కొంపా తిరగడం? మీ నాన్నకి నే చెప్పానని చెప్పి ఓ జంధ్యం పోగు వేయించుకో- తద్దినాలకి రెండో భోక్తకైనా పనికొస్తావ్. మన అగ్రహారంలో ఆబ్దికాలకి కరువులేదు - కొక్కిరాయి వెధవ-”

తినేసిన ఎంగిలి ఆకుని తీసి పారేస్తోంది అత్తయ్య- కూడా నేనూ బయటకు నడిచాను.

*

తులసి కోట ముందు కూచుని- వీధి వాకిట్ని ఓ కంట కనిపెడుతూ కొబ్బరి ఆకుల్ని చీల్చి ఒబ్బిడిగా చీపుళ్ళు కడుతున్నారు వాళ్ళిద్దరూ. మామయ్య చేస్తున్న పని ఆపి, పచ్చి కొబ్బరి ఆకులతో రెండు బూరాలు చుట్టి, దానికి పీకలు పెట్టి నిమ్మముళ్ళు గుచ్చి తయారుచేశాడు. రెండూ ఊది చూసి “బుచ్చీ! నీకోటి నాకోటి” అన్నాడు. ఇద్దరూ పీపీ పీపీ అని ఉత్సాహంగా బూరాలు ఊదుతుంటే పెరట్లో చెట్లమీద పిట్టలు కలవరపడ్డాయి- ఎవరీ కొత్త పక్షులని!

ఊదిన ఆయాసాన్ని అణుచుకుంటూ- “బుచ్చీ! మన పెళ్ళి మేళం గుర్తొస్తోందే!”

“ఎందుకు రాదూ- పెళ్ళి మేళం ఖర్చు యావత్తు మగ పెళ్ళివారిదే అన్నారు. తంజావూరు నించి సన్నాయి దిగుతుందన్నారు.రాముడోళ్ళు, నౌబత్ ఖానాలు, తాషామర్ఫాలు, తప్పెట్లూ, భోగం మేళం- భూమీ ఆకాశం దద్దరిల్లుతుందన్నారు. ఆఖరికి ఏ మేళమూ లేకపోయె. సడీ చప్పుడూ లేకుండా పెళ్ళేవిటని మావూరి గంగిరెద్దు సాంబయ్యని బతిమాలితే తూతూ అనిపించాడు. చివరకి వాడికి ఒక్క వరహా యిప్పించేసరికి మా తల ప్రాణం తోకకి వచ్చింది-”

“ఇదిగో బోసినోరు వేసుకుని ఆట్టే వాగకు. మీవాళ్ళు తక్కువా- అయిదు రోజుల పెళ్ళని చివరికి ఏడుపూటల భోజనంతో సరిపెట్టలా?”

“పీపీ... పీపీ”

“బూ... పీ... బూపీ...”

"పెళ్ళివారు దిగిన పూట పొద్దుపోతే ఏకభుక్తం- మరో పూట శనివారం ఉపోషాలంటారు. అవి తక్కువ తిన్నారా- జోడు గుండిగల నిండి పులిహోర, రెండు గోకర్ణాల అప్పచ్చులు విడిదికి పంపితే గుండిగలూ గోకర్ణాలూ తోమే పనుంటే ఒట్టు. రెండుకావిళ్ళ మజ్జిగ మాయం చేస్తారు. ఆరెకరం అరటిగెలలు ఒంటెద్దు బండిలో తోలితే కిష్కింధాపుర అగ్రహారీకుల్లాగా తొక్కలన్నా మిగిల్చారా!"

"బూబూ... పీపీ..."

"నీ బొంద... వంటలన్నీ ఓషధప్రాయంగా చచ్చాయ్ - దర్భపుల్లతో నెయ్యి వడ్డించారు. బూజం బంతిలో.... పీ... బూ..."

"మీ మొహాలకు అదే ఎక్కువ అన్నాడు మా బాబయ్య"

"తూ.. పీపీ..."

"అసలు శాకాల్లో ఘనపంచరత్నాలని చెప్పేవి వున్నాయ్. గుత్తి వంకాయ కూర, కందబచ్చలి, మంచి గుమ్మడి శెనగపప్పు..." అనగానే అత్తయ్య అందుకుని.

"పనసపొట్టు ఆవపెట్టు, అరటికాయ అంటుపులుసు- తెలుసు. ఈ ఐదున్నూ ఘన పంచరత్నాలు. ఈ అరవై ఏళ్ళలో ఘడియకోసారి వినీవినీ నా చెవులు చిల్లులు పడ్డాయి నీ పుణ్యాన- పెట్టుకోడానికి ముద్దుల్లేవు గాని చిల్లులు మాత్రం మిగిలాయి..."

"ఇదిగో ప్రస్తావన మార్చకు. నేను ఘోషిస్తోంది పాకశాస్త్రం గురించి"

"బు బూ... పి... పీ...."

"అన్ని వేదాల్లాగే పాక వేదం కూడా అపౌరుషేయం. అపౌరుషేయం అంటే నీకు తెలియదు. నిరక్షర కుక్షివి. అంటే కూడా తెలియదు. సరే పోనీ పరంపరగా సంక్రమించే విద్య- పాక వేదంలో కూడా ఉదాత్త అనుదాత్తాలు పాటించవలె" అనగానే

"బుబు బూబు పిపిపీపీ... పీపీ పీపిపి బూబుబూ- ఇవేగా ఉత్తుత అత్తాలంటే-"

"పారేయ్ వెధవ బూరా అవతల పారేయ్. వయోధర్మం లేకుండా ఏమిటా పిల్లచేష్టలు" అంటూ ఆత్తయ్య చేతిలో బూరా లాగి అవతల పారేశాడు. అత్తయ్య కొబ్బరి మట్టయించి తెచ్చి మావయ్య చేతిలో బూరా లాక్కుపోయింది. ఇద్దరి మధ్యా పెనుగులాట ప్రారంభమైంది. మరికాసేపటికి పిలక ఆత్తయ్య చేతిలోనూ కొప్పు మావయ్య గుప్పిట్లోనూ వున్నాయి. ఆ పట్టులో వుండగా "పీపీ" అన్న బూరా మోతకి ఇద్దరూ గుప్పిట్లు వదిలి వెనక్కి చూశారు. ఎవర్రా అన్నట్టు.

"నేనే! బూరా దొరికితే..." అని గొణిగాను.

మావయ్య మట్టకి చుట్టుకుపోయిన కాశీతువ్వాయి తీసి విదిలించి "ఊదరా- బాగా ఊదు- ఎటూ ఊరంతా బాగా ఊదుతున్నావుగా వున్నవీ లేనివీ"

"....................."

"ఏరా! నేనూనున్నను, అదినున్నను దీపాలార్పేసి ఆరుబయట వెన్నెట్లో కూచుని ఒకే విస్తట్లో భోజనం చేయడం కళ్లారా చూశానని శుద్ధ అబద్ధాలన్నీ ప్రచారం చేసేశావు నన్నూ నా ఆడవాళ్లనీ అప్రతిష్టపాలు చేయాలన్చెప్పన్చెప్పి...." మావయ్య తీవ్ర కోపావేశాయాసంతో పడిపోతే అత్తయ్య జోక్యం చేసుకుని "అబ్బాయ్ చీటికీ మాటికీ ఆయన చేత అబద్ధాలాడించకరా. ఆనక మావయ్య నరకంలో నానాయాతనా పడాల్సి వస్తుంది పాపం!" అని సర్ది చెప్పింది. మావయ్య తక్షణం బూరా అందుకుని పిచ్చిపిచ్చిగా వూదడం మొదలు పెట్టాడు.

*

నడిమింట్లో ఓ వైపు గొలుసుల ఉయ్యాలబల్ల వుండేది. మరోవైపు గున్న ఏనుగు నిలబడ్డట్టు పందిరిపట్టె మంచం వుండేది. మావయ్య మధ్యాన్నం వేళ కాసేపు ఉయ్యాలమీద జోగేవాడు.

క్రీంక్రీం అంటూ ఉయ్యాల గొలుసులు జోకొడుతూంటే మాగన్నులోంచి కళ్లు విప్పి చూశాడు. గడపవారగా కూచుని పత్తి విప్పి వత్తులు చేస్తున్న అత్తయ్యని చూసి ఏదో గుర్తొచ్చిన వాడిలా చటుక్కున లేచి- "రేపటి కూర మాటేమిటి? ఏమన్నా ఆలోచించావా?" అన్నాడు. పెద్ద సమస్య అయినంత కంగారుగా.

"రేపటి సంగతి రేపు- తెల్లారనీ" అన్నదావిడ మెత్తగా.

మావయ్య మొహంలో ఆలోచన తీవ్రత కనిపిస్తోంది. ఉన్నట్టుండి అత్తయ్య కథ మొదలు పెట్టింది- "ధర్మరాజులవారూ- గుమ్మంలోకి ముష్టి వాడొస్తే 'రేపురా' అన్నార్ట. అదివిని భీములవారు నవ్వాట్ట. ఎందుకురా నవ్వుతున్నావు అని అన్నగారడిగితే నువ్వు రేపటిదాకా ఖచ్చితంగా బతికివుంటావు కదా అని ఆనందపడుతున్నాను అన్నాట్ట! ఆపళంగా ధర్మరాజు సిగ్గు పడిపోయి ముష్టివేసి పంపాట్ట" అని ముగించింది.

ఉయ్యాల క్రీంకారం నీరసంగా వుంది.

"అమ్మో! అదో చిత్రం- దానికో లెక్క వుంది. దేవుడు విస్తరాకుల మీద పేర్లు రాసి పెడతాడు. మనం పుట్టగానే- వీడికి ఇన్ని దీనికి యిన్ని అని ఎంచి వాటికి వరసాగ్గా అంకెలు వేసేసి ఆకులమీద

దస్కత్తులు పెడేస్తాడు. వాడి వంతు ఆకులు చెల్లిపోయాయనుకో యింకేముంది! మిగిలేది నేల. అయితే ఆ అంకెలు కనిపించవు మనకి. ఆ లిపి అర్థం కాదు. అంచేత అదంతా నిగూఢం" ఆయన వేదాంతం పూర్తికాకుండానే అత్తయ్య లోపలికి వెళ్ళింది.

"ఇవి లోతైన విషయాలు. నీకు చెప్పినా అంత తేలిగ్గా అర్థం అవుతాయా!"

వంటింట్లోంచి చిటపటలు వినిపించాయి. మరికాసేపటికి అత్తయ్య చిన్న వెండిగిన్నెతో ఘుల్లుఘుల్లున వచ్చి ఆయనకి అందించింది.

"సరి పేలాలా! మంచి ఊహా తట్టిందే!" అని విస్తుపోయి "బొండు మల్లెల్లా విచ్చాయ్" అంటూ నోట్లో వేసుకుని "ఉప్పుకారం సరేగానీ ఆ నేచుక్కా చిటికెడు జీలకర్రపొడీ సమకూరడం వల్ల సరి పేలానికి వైభవం దక్కింది"

"సరేలే! చిన్ని నా బొజ్జకి శ్రీరామరక్ష- ఎప్పుడూ ఇదే రంధి. ఏ యాత్రా ఏ పాత్రా! మాధవుడికి రైలుపాసు కూడా వుంది. కాశీ తీసికెళ్ళి గంగాస్నానం చేయిస్తానంటే ఊ అంటేనా- దేనికైనా ప్రాప్తం వుండాలి" అత్తయ్య గొంతు జీరబోయింది.

ఆయనేమీ చలించలేదు. పేలాలు ఒక్కొక్కటే నోట్లోకి విసురుకుంటూ "అమ్మీ! ఒక్క సూక్ష్మం చెబుతా విను. గంగ కాశీలోనే వుందనుకోడం నీ అజ్ఞానం. కాశీలో పుట్టిన మబ్బు కొంచి కొంచి కాళహస్తి మీద కురుస్తుంది. స్వర్ణముఖిలో చెలమ మేఘమై కదిలి శ్రీశైలాన చినుకుతుంది. కృష్ణ నీరు కరిమబ్బు తునకై పోయి పోయి కావేరి మీద వడగళ్ళుగా రాలుతుంది. గోదారి ఆకాశమార్గాన కనకదుర్గమ్మకి నీళ్ళకావిళ్ళు సారె పంపుతుంది. అందుకని గంగాస్నానం కోసమని కాశీదాకా వెళ్ళక్కర్లేదే బుచ్చీ - తొలకరి వానకి మన చూరు కింద తల పెడితే ఏడు నదుల్లో స్నానం చేసిన ఫలమూ తద్వారా ఏడు జన్మలకి సరిపడా పుణ్యమూ వస్తుంది"

"పుణ్యం కాదు. పుట్టెడు జలుబొస్తుంది. నీ వెర్రి వేదాంతం విని విని నాకు చిర్రెత్తుకొస్తోంది. ఎప్పుడో ఆవేశంగా నిన్ను చంపి నే చచ్చి వూరుకుంటా పీడా వదుల్తుంది" కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

మావయ్య నవ్వి "మరింకేం- అదే ఆనందస్థితికి చేరుకున్నావ్! నీకు జన్మరాహిత్యం తప్పదే బుచ్చీ!! వచ్చే జన్మలో వేరే పిల్లని వెతుక్కోవాలిందే-"

అత్తయ్య కూడా నవ్వాపుకోలేక కళ్ళొత్తుకుంటూ నవ్వొత్తుకుంది.

*

పెద్దలు ఇచ్చిన మూడెకరాల భూమి వుంది అప్పదాసు గారికి. ఏటా సంకురాత్రికి మూడు

పుట్లకొలు ధాన్యం వస్తే ముందువైపు పాతర వేయించేవాడు.

ఏరువాక వచ్చే రాకుండానే పాతర తీయించి ఓ పుట్టి ధాన్యం రోజువారీ వాడకానికి వెదురుగంపలతో పోయించి, మిగతావి అమ్మేసి పై ఖర్చుకి పక్కన పెట్టేవాడు. తొలకరించగానే పూడ్చిన పాతరగుంట మీద పొట్లపాదు, చిక్కుడుగింజలూ పెట్టేవాడు. గుబుగుబురాగ్గా వుండే పాతమట్టిమీద తోటలి గట్టిసారం పీల్చుకుని పాదులు వినాయకచవితికి పందిళ్లు కొంగిపోయేలా కాసేవి. కొయ్య తిరగలి ముందేసుకుని ఎదురుబొదురుగా కూచుని వారానికోసారి ధాన్యం విసురుకునేవాళ్లు.

“పట్టు కదిలిచావు... నువ్వే పెద తిప్పుతున్నాక్... ఏవిటా పెడసరం.... మనకాపరం.....”. ఇద్దరూ ఒకర్నొకరు కసురుకుంటూ విసురుకుంటూ ఊకా నూకా చెరిగి, కందుల్లాంటి బియ్యం బానకి ఎత్తేవారు.

“నాచేత నెత్తురుకూడు తినిపిస్తున్నాక్” అని ఆవిడగొణిగితే- “ఆ! మరే! రాక్షసులు ఇష్టంగా తింటారనీ...” మావయ్య మాటకి మాట వేస్తే కాసేపు తిట్లవాన కురిసి వెలిసేది.

ఎప్పుడు చూసినా ఇద్దరూ ఏదో పనితో మునిగిపోయి వుండేవారు. ఊరగాయల తరుణం వస్తే యిక చెప్పాలా! కారాలూ మిరియాలూ నూరుకుంటూ పెళ్లి పనులలా చేసి పడేసేవాళ్ళు ఊరగాయలు.

వానాకాలం చెట్లనీళ్ళ పని లేకపోతే వేరే పనులు కల్పించుకునేవాళ్లు. తాటాకులు చీల్చి చక్కగా చదరలూ; ఊరేసిన చెండలూ గోగులూ నారతీసి తాళ్లు పేని పందిళ్లూ అల్లేవారు. రావిన

తాటిపళ్ళు బుర్రలు పోగుచేసి తేగపాతర వేసేవారు. వాకిలి ముందు ఇంటివైపుకి వాలి పెద్ద వేపచెట్టు వుండేది. వైశాఖంలో రాలే వేపపూతకి చెట్టుకింద చాపలు పరచి, మధ్యాన్నాలు చల్లగా కాలక్షేపం చేసేవారు. ఆరోజు ఇద్దరూ చెట్టుకింద చాపమీద కూచుని, వైకుంఠపాళి ఆడుకున్నారు. పందాలు వేస్తూ పావులు కదుపుతున్నారు. మావయ్య పాము నోటపడి జారాడు. అత్తయ్య నిచ్చెన్ల మీద నడుస్తోంది.

"చూడు చూడు - రామచిలక మామిడిపిందె తెచ్చుకు తింటోంది" అన్నాడు పైకి చూస్తూ.

అత్తయ్య వేపచెట్టుమీదకి పరిశీలనగా చూసి కళ్ళతో వెతికి "మామిడిపిందె కరెక్టే గాని, అది చిలక కాదు- ఉడత" అంది.

"చిలక! ఎర్రటిముక్కూ పచ్చటి తోకా కనిపిస్తూంటేనూ..."

"ఉడత! రాముగారు గీసిన మూడు గీతలూ స్పష్టంగా కనిపిస్తూంటేనూ..."

వీళ్ళ గొడవలో ఉడతో చిలకో తేలకుండానే అది పారిపోయింది. అత్తయ్య చూపు మళ్ళీ ఆట మీదికి మళ్ళింది. తేలుకుట్టినట్టు ఒక్కసారి పెద్దగా

"అయ్యోదేవుడో- నా పావు కదిపేశాడు- తొండి చేశాడు" అరిచింది అత్తయ్య.

"తొండి చేయాల్సిన అగత్యం యీ అప్పదాసుకి లేదు" అన్నాడు గంభీరంగా.

"ఆడదాన్ని అన్యాయం చేస్తే నరకానికి పోతావ్. అక్కడ రక్కసపొదలో వేసి ఉయ్యాలలూపుతూ తీతువు పక్షి చేత జోలలు పాడిస్తారు - ఆ!!"

"ఏం పర్వాలా. ఆ జోలలతో అయిదుగురు పిల్లలు పెరిగి పెద్దాళ్ళవలేదా-"

"ఒరి మాయలపకీరూ! నీతో ఆటకి కూచోడం నాదే తప్పు"

మాటామాటా విసురుకున్నారు. ఇహ మాటలు స్ఫురించక గవ్వలు అందుకున్నారు.

పందెపు గవ్వ తలకి తగిలి "అబ్బా" అన్నాను.

రెండుకళ్ళు తీవ్రంగా నన్ను చూస్తున్నాయి.

"ఒరే విభీషణాయ్ ఇటురారా" అని పిలిచాడు మావయ్య తీవ్రస్వరంతో.

అత్తయ్య "నొష్టరాసిన రాయి తుడిచినా పోదు- చీర చెరుగుయి పెట్టి అద్దినా పోదు- పైట చెంగుల తోటి వులిమినా పోదు-" అని పాడుకుంటూ చెదిరిపోయిన గవ్వాయి తిరుగుతూ ఏరుతోంది.

"రమ్మంటే రావేరా" అని మళ్లీ గద్దించాడు మావయ్య.

అసలే ఆయన బొటనవేయినించి బోడిగుండుదాకా గంధం పట్టించుకు న్నాడేమో కళ్లు మాత్రం కనిపిస్తూ దయ్యంలా వున్నాడు. చచ్చేంత భయంగా వెళ్లి దగ్గర నిలబడ్డాను. ఆ భయంతో చేతులు కూడా కట్టుకున్నాను.

" అతి వినయం ప్రదర్శించకు. అడిగిందానికి సమాధానం చెప్పు"

"..................."

"మా తేటీసుకి నేను రోజూ తలదువ్వి జడవేస్తున్నానని ఊరంతా టాంటాం వేస్తున్నావట- ఏదో చెయ్యి తిరగక అది భస్తూ వుంటే కాస్త సాయం చేస్తే అది నీకు వేళాకోళంగా వుందా?"

నేనేదో చెప్పబోతుంటే చెయ్యెత్తివారించి, అప్పదాసు అనేవాడు—

"గోరింటాకు రుబ్బి పెళ్ళాం చేతికి కాకరాకు వేసి మరీ పెట్టాడని అగ్రహారబ్బడితలంతా ఆడిపోసుకుంటున్నారట— ?"

"ఆ- నా బొంద- ఉబలాటం తప్ప పండిందా చచ్చిందా" అంది అత్తయ్య గవ్వాయి కుప్పబోస్తూ—

మావయ్య ఒక్కసారి బుసవదిలాడు.

"వసకొమ్ము మింగి చచ్చావా - పిచ్చపక్షి..." ఆవిర్లు గసిరి మళ్లీ నామీద పడ్డాడు.

"నా అధిక మాసాలంత లేదు నీ వయసు... వెధవ... వెధవన్నర వెధవ... పోనీ బొడ్డూడని వెధవ్వి చెప్పావేపో... దానికా ముదురు పీనుగులంతా పడీపడీ పోవాలా...." మావయ్య నోరుచించుకు అరుస్తూంటే అత్తయ్య అందుకుని "వీటకేం గాని వీపురుద్ది స్నానం చేయిస్తున్నాడని చెప్పవురోయ్- నువ్వసలే తొక్కం తెలీని వెధవ్వి-" అంది హెచ్చరికగా.

పళ్లు కొరికి చెవుల్ని కూడా కప్పేస్తూ కాశీతుండు గుండుకి చుట్టుకున్నాడు మా అప్పదాసు మావయ్య.

*

అది శ్రావణమాసం. నేలచిత్తడిగా వుంది. శుక్రవారం పేరంటానికి అత్తయ్య మా ఇంటికి వచ్చింది.

మరికాసేపటికల్లా మావయ్య చేతికర్ర, వెలిగించిన లాంతరు పట్టుకుని వచ్చి మా వీధి అరుగుమీద కూచున్నాడు. ఇంకా అప్పటికి సూర్యాస్తమయం కూడా కాలేదు.

“క్షణం కూడా వదిలి వుండలేడు- కొత్త పెళ్లికొడుకు” అనీ “నిన్ను కాకి ఎత్తుకుపోతుందని భయం” అనీ సరసాలకి వరసైన వాళ్లు పేరంటంలో అత్తయ్యని ఆట పట్టించారు.

మావయ్య క్షణాలు లెక్క పెడుతూ మాటిమాటికీ లోపలికి తొంగిచూస్తున్నాడు. పేరంటాళ్లంతా కదిలి వెళ్ళిపోయాక-

అమ్మ పళ్లెంలో తాంబూలం, పళ్లూ శనగలూ పెట్టుకుని అరుగుమీద కూచున్న మావయ్య చేతికి యిచ్చింది. ఆయన మొహం నిండుగా వెలిగింది. అమ్మ మావయ్య కాళ్లకి మొక్కింది. తలనిమిరి “దీర్ఘసుమంగళీభవ” అని నోరారా దీవించాడు.

“పొద్దుకూకితే దానికి కన్ను కనబడదు- అసలే బురద- జారిపడితే నా చావుకొస్తుందని వచ్చా” అన్నాడు మావయ్య సంజాయిషీగా.

“ఆది దంపతుల్లా మీ ఇద్దరూ వచ్చారు. నిజంగా నా నోము పండింది. ఆ పళ్లెం ఇటివ్వండి. పిల్లాడితో ఇంటికి పంపుతా” అంది అమ్మ మర్యాదగా.

“ఆ, ఎందుకమ్మా - చాదస్తం-” అంటూ పై తువ్వాలు పరిచి వాయనం అందులో గుమ్మరించి పళ్ళెం అమ్మచేతికిచ్చేశాడు మావయ్య.

అత్తయ్య నుదుట బొట్టు మీద బొట్టుతో, గంధం పూసిన మెడతో, పసుపు కాళ్లతో ఘల్లుఘల్లుమంటూ కొంగులో వాయనం పట్టుకుని బయటకు వచ్చింది. మావయ్య ఆమెని నిలువెల్లా ఓసారి తేరిపారా చూశాడు.

అప్పుడే పశువులు ఇళ్లకి వస్తున్నాయి. గొడ్ల వెంట వస్తున్న మా నాన్న మావయ్యని చూసి “వాళ్ల ఆవునీ దూడనీ బావకి చూపించు మళ్లీ ఆయన దొరకడు, ఏ కళనున్నాడో యివ్వాళే మెట్టుదిగాడు” అని నాకు పురమాయించాడు. నేను వాళ్ల ఆవునీ దూడనీ తోలుకొచ్చి అరుగుదగ్గర నిలబెట్టాను. మావయ్య అరుగుదిగి ఆవుమెడ నిమురుతూ “మీ చేతుల్లో వుండగా దానికేం లోటు! కామధేనువులా వుంది”

తన తువ్వాల్లోంచి గుప్పెడు శనగలు తీసి చేత్తో నోటికి అందిచ్చాడు. ఆవు ఆత్రంగా తినేసి మావయ్య అరచేతిని కూడా నాకింది. ఆ స్పర్శను కాసేపు ఆనందంగా అనుభవించాడు.

దూడ ఒకచోట నిలవక చెంగనాయి వేస్తోంది.

మావయ్య ఆవు ఒళ్లంతా నిమిరి "మళ్లీ జున్ను ఎప్పుడు పెడతావమ్మా" అన్నాడు మురిపెంగా.

"ఇంకా మూడు నెలలు ఆగాలి బావా" అన్నాడు మా నాన్న.

ఆవు మెడలో గంట కదిలి చప్పుడైంది. "సత్యం-ఋణానుబంధ రూపేణా పశు-పత్ని-సుత-ఆలయం అన్నాడు గాని చెట్టుని మరిచిపోయాడయ్యా - అసలు ఋణానుబంధం చెట్లదే -" అన్నాడు మావయ్య గంభీరంగా.

"మీకెప్పుడూ అదే యావ" అని ప్రస్తావన మార్చి సైగతో చెప్పి నాచేత కూడా మావయ్య కాళ్లకి మొక్కించారు అమ్మా నాన్న.

"నా అంత వాడివి కావాలిరా పోకిరీ గాడిదా" అన్నాడు మావయ్య వెన్ను మీద చెయ్యేసి.

"పాపం యింకేదయినా మంచి ముక్క అనకూడదూ" అంది అత్తయ్య.

మావయ్య గలగలా నవ్వి "మీ అత్తయ్య లాంటి మాంఛి పెళ్లాం నీకు జతపడాలిరా" అన్నాడు.

"అట్లా అన్నారు బావుంది" అంది అత్తయ్య గర్వంగా బోసినవ్వుతో.

ఇద్దరూ కదిలారు. అమ్మా నాన్న, ఆవు-దూడ, నేనూ వీధి దాకా సాగనంపాం.

ఇహ ఇద్దరూ వీధిన పడ్డారు. మావయ్య భుజం మీద చిన్న మూట- చేతిలో లాంతరు, చేతికర్ర. "ఆ మూట ఇటివ్వు నే తెస్తా—" చెయ్యి జాపుతూ అంది అత్తయ్య.

"నేనివ్వను- ఇది నా వాయనం- ప్రత్యేకం ఇచ్చారు"

"ఇచ్చార్లే పోకు పేరంటాలివి వచ్చావని- మూటజారితే మట్టిపాలవుతాయ్"

"ఏమీ అవవు- ఇదిగో ఇంటికెళ్ళాక మళ్లీ తిరకాసు పెట్టకు. నా వాయనం నాదే. ఇప్పుడే చెబుతున్నా" అడ్డం తిరిగి నిలబడి పేచీకి దిగాడు.

"రాత్రిప్పూట అన్నీ శనగలు తింటే...!"

"అవి నా స్వార్జితం- నా హక్కు భుక్తం- నీ జోక్యం సహించను-" మావయ్య సుస్పష్టంగా చెప్పాడు.

"సరే పద- ముందు ఇంటికి జేరనీ- ఇంత రొప్పు మనిషిని నే భరించలేను బాబూ"

"అటక ఎక్కించి నిచ్చెన తీశాకే- నిన్ను యీ జన్మకి నమ్మాలని వుందీ!"

"శ్రావణశుక్రవారం పూటా వీధిలో పంచాయితీ పెడతావా- నీవల్ల పేరంటంలో నానామాటలూ అని నవ్వారు. నా చులక అయిపోయింది. ఇదిగో ప్రతిదానికీ నామీద ఒంటికాలిమీద లేచావంటే- అయిదుగురు బిడ్డల తల్లిని- ఏమనుకుంటున్నావో- కాకి చేత కబురు పెడితే రెక్కలు కట్టుకు వాలారు. దర్జాగా పల్లకీ ఎక్కించి తీసికెళ్తారు" అత్తయ్య కంఠంలో కోపం బాధ.

"ఓసోస్- సమయం వస్తే నన్నూ తీసికెళ్తారు పల్లకీలో- కాని శనగల విషయంలో రాజీ ప్రసక్తి లేదు" అన్నాడు తెగేసి.

పేరంటానికి వెళ్లిన సందడి మళ్లీ గూటికి చేరింది.

పందిరిమంచం మీద కూచుని సాతాళించిన శనగలు తిని రాగిచెంబుతో తులసి తీర్థం తాగి-"బుచ్చీ బావుందే" అన్నాడు తేనుస్తూ.

ఆవిడ ఊకొట్టింది ఆవలిస్తూ.

కిటికీలోంచి పందిరిమంచం మీద పడుతున్న వెన్నెల పట్టెల్ని తడుముతూ "అమ్మ చూశావా, వెన్నెల కొబ్బరి తురిమి ఆరబోసినట్టుందే"

"దాంతో ఇప్పుడు కొబ్బరి తాజు చేయమంటావా ఏంటి- పొద్దోయింది- పడుకో-"

"నిద్ర రావడంలే- మనసు ఇవాళ చిత్రంగా వుంది"

"కళ్లు మూసుకో- అదే వస్తుంది"

"మూతపడందే..."

ఆయన వాలకం చూసి ఆవిడ లేచి దగ్గరగా కూచుంది.

"సత్సంగత్వే నిస్సంగత్వం... తోడూ నీడా నాకు దొరికినంత గొప్పగా ఆ దేవుడికి కూడా దొరికి వుండదు"

"అవన్నీ ఇప్పుడెందుకూ?"

"ఎందుకో అనాలనిపిస్తోంది. నీకు ఆ దాక్షారం సమ్మంధమే కుదిరుంటే యీ వైభవం నాకు దక్కేదా? నీ బతుకు యిట్లా వుండేదా- పేదరాసి పెద్దమ్మలా... పాపం...."

"ఆ దాక్షారం లేదు. ఎత్తుపారం లేదు"

ఆ మాటకి అనుమానంగా ఆమె కళ్లల్లోకి చూశాడు.

"నిజం. మన కిష్టప్ప మీద ఒట్టు... ఊరికే నిన్ను ఉడికించడానికి అనడమే ఉత్తుత్తినే-"

ఆమె మాటకి మంచుకురిసిన తమ్మిరేకుల్లా వున్న ఆయన కళ్లు మెరిశాయి.

"మొండి ఘటాన్ని లొంగతీయడానికే ఆ దాక్షారం- మాధవుడి మీద ఒట్టు. అనుకున్నదే అయింది ఒక్కటే సమ్మంధం. నాకు నగల మీద మోజు లేదు. అవి లేవన్న వెలితీ లేదు. నారాయణుడి సాక్షిగా చెబుతున్నా" అంది చేతిలో చెయ్యేస్తూ.

"బుచ్చమ్మా! ఎంత చల్లటిమాట చెప్పావే" అంటూ హాయిగా ఊపిరి పీల్చాడు.

అదే ఆఖరి మాట. అదే చివరిశ్వాస. తెల్లటివస్త్రంలా ఆయన దేహాన్ని వెన్నెల నిలువెల్లా కప్పింది.

కాకి కబురు అందుకుని ఐదుగురు పిల్లలూ రెక్కలు కట్టుకువాలారు.

పల్లకీ ఎక్కించి తీసికెళ్లారు తండ్రిని. మనవళ్లూ మనవరాళ్లూ అటువైపువాళ్లు ఇటువైపువాళ్ళు అంతా వచ్చారు.

"కంచంత బలగం వున్నా 'మీ ఇద్దరిదే యీలోకం' అన్నట్టు బతికారు" అనుకున్నారు అందరూ.

"ఇంక నాకు పొద్దుపోడవదు. చిలకంటే చిలకే- ఉడతంటే ఉడతే - కాదనేవాడెవడు? ఘటియారంలో పెద్దముల్లు రాలిపోయింది- ఇహ నాకు క్షణాలు కదలవు" అని అత్తయ్య గోడుగోడున ఏడ్చింది.

పెరటితోట తల వాల్చింది- మహారాజ పోషకుడు మరి లేడని.

నాలుగు రోజులదాకా ఆ యింటి చాయలకు వెళ్లలేకపోయాను. మావయ్య వేసిన తేగల పాతరలా ఎన్ని జ్ఞాపకాలో...

అలవాటుపడిన కాళ్ళు ఆటే లాగేస్తున్నాయి. వెళితే అత్తయ్య ఒక్కతే కుంకుడుచెట్టు కింద కూచుని వుంది.

నన్ను చూసి ఒక్కసారి బావురుమంది. నన్ను దగ్గరగా కూచో పెట్టుకుంది. నాకేం మాట్లాడాలో తెలియదు కాసేపటికి ఆవిడే తెప్పరిల్లింది.

“అబ్బీ! నీతో నిజం చెబుతున్నా- నేను ముందు రాలిపోతానేమోనని క్షణక్షణం భయపడి చచ్చేదాన్ని. ఇపుడు నాకు పెద్ద బరువు తీరిందిరా...”

నాకు అత్తయ్య మాటలు విడ్డూరంగా తోచాయి.

“నేముందు పోతే పసుపుకుంకాలు మిగిలేవేమో గాని ఆ జీవుడు ఎంత అవస్థ పడేవాడో నాకు తెలుసు. పైనున్న భగవంతుడికి తెలుసు. ఒరే పచ్చటి చెట్టుకింద కూచుని చెబుతున్నా- దేవుడా ఈ మనిషిని తీసికెళ్ళు ఆనక నా సంగతి చూడు” అని రోజూ దణ్ణం పెట్టుకునేదాన్ని. మొగుడి చావు కోరుకునే వెర్రిముండ ఉంటారా అనుకోకు. వుంటారు. నాకు మీ మావయ్యంటే చచ్చేంత ఇష్టంరా. ఆయన ముచ్చట చెల్లకపోయినా, కోరిక తీరకపోయినా నా ప్రాణం కొట్టుకునేది.

అత్తయ్య చెబుతూంటే ఆ ఊ అనకుండా మౌనంగా వింటున్నాను. “చీకటంటే భయం- ఉరిమితే భయం- మెరుపంటే భయం- నే వెన్నంటి వుండకపోతే ఎవరు ధైర్యం ఇస్తారు! అర్ధరాత్రి పూట ఆకలేస్తోందని లేచి కూచుంటే ఆవిరి కుడుములూ కందట్లూ పొంగరాలూ ఎవరు చేసి పెడతారు? పిలిస్తే పలకెత్తే పిచ్చి వెర్రికోరిక లెవరు తీరుస్తారూ? కొడుకా కోడలా- మనవడా- దేవుడా? నేనన్నది కరెక్టా కాదా?”

“..................”

“ముచ్చటా మాట్లాడవేరా?” అని చిరాకుపడి

“అబ్బాయ్! పై అంటే పై, నువ్వంటే నువ్వనుకోడమే గానీ అరమరికలూ తెరమరుపులూ ఎరగం- మేం మొగుడూ పెళ్ళాలన్నది ఎప్పుడో... అప్పుడే పెళ్ళిపల్లకీలోనే మరిచిపోయాం”

అత్తయ్య మాటకి అర్థం కానట్టు చూశాను. ఆవిడ పెదాలమీద చిన్న నవ్వు మెదిలింది.

“ఏమైందంటే... లగ్నం కాగానే మమ్మల్ని పల్లకీలో ఊరేగిస్తూ అమ్మవారి గుడికి తీసికెళ్తూంటే- దారిమార్గంలో తన మధుపర్కం కొంగుకి ముడేసి వున్న మూట విప్పి పిడికెడు వేరుశనక్కాయలు నా దోసిట్లో పోశాడు. నా ఒళ్ళు ఝల్లుమంది. గుండెతీసి యిచ్చినట్టనిపించింది. ‘తినుతిను.. బావుంటాయ్. కాలక్షేపానికి ఉంటాయని తెచ్చాను’ అన్నాడు. ఇంకా మీసమైనా రాలేదు- యీ అబ్బాయికి ఎంత ధైర్యం- అనుకున్నా

ఓం ప్రథంగా మా సాహసం అక్కడే మొదలైంది. తాడెవడో మంచివాడే. పంచుకుతినే రకం అని గురి కుదిరింది. డెబ్బై ఏళ్ళు అయినా పల్లకీతో దొంగచాటుగా తిన్న శనక్కాయల రుచి ఇప్పటికీ నా నాలిక మీద వుందిరా—" చిరునవ్వు చెమరిచ్చినట్టయింది.

ఒకసారి గాఢంగా శ్వాస పీల్చి నిబ్బరించుకుంది అత్తయ్య. "ఎక్కడెక్కడో వున్న పిల్లల్ని పచ్చటి చెట్లల్లో చూసుకోడం నేర్పించాడు మీ మావయ్య. ఇన్నేళ్ళ సాహసంలో కావల్సినన్ని కబుర్లు చెప్పాడు. ఉత్త పోచుకోలు కబుర్లు కాదు. బతుకు బరువు తగ్గించే ముక్కలు. నేను కాసే పూసే ప్రతి చెట్టులోనూ మీ మావయ్యని చూసుకోగలను. ఒక్క బంగారంలా కలిసిపోయాం. బంగారం కరిగించింది. ఇదిగో ఈ ఒక్క ముద్ద మిగిలింది. ప్రమిద లేని వత్తి ఎన్నాళ్ళుంటుంది! నా విస్తళ్ళు అయిపోగానే నేనూ..." ఎక్కిళ్ళు వినిపించాయి.

"ఇన్నీ చెప్పి మరి మళ్ళీ ఎందుకు ఏడుస్తావ్" అని గసిరాను.

అత్తయ్య ఉలిక్కి పడి నాకేసి చూసి "మరి బతుకంటే అదేరా బడుద్దాయ్" అని బోసిగా నవ్వింది.

***